# నిర్మాణం - విచ్ఛిన్నం

మూలం :

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మతై)



అనువాదం :

అబుల్ ఇర్ఫాన్






తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్‌కోట్, ఛత్తా బజార్,
హైదరాబాద్ - 500002

ప్రథమ ముద్రణ : మార్చి 1990

ప్రతులు : 2000





వెల : రు. 3-00



ప్రకాశకులు :
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్‌కోట్, ఛత్తాబజార్,
హైదరాబాద్ — 500 002

ముద్రణ :
కాస్మిక్ ప్రింటర్స్
లక్కడ్‌కోట్, ఛత్తాబజార్
హైదరాబాద్-500 002

# మా మాట

ఈ ప్రసంగం 1947 మే 10న మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది గారు దారుల్ ఇస్లామ్ పఠాన్ కోట్‌లో ఓ బహిరంగ సభనుద్దేశించి చేశారు. ఆ సభలో రెండు వేల ముస్లిములు, రెండు వందలకు పైగా హిందువులూ, సిక్ఖులు పాల్గొన్నారు. దీన్ని చదివేటప్పుడు పూర్వరంగాన్ని కూడా దృష్టిలో పెట్టుకోవడం మంచిది. ఆ కాలంలో తూర్పు పంజాబ్ మొత్తం అగ్నిపర్వతంలా కుతకుతలాడుతోంది. ఈ ప్రసంగానికి మూడు నెల్ల తర్వాతనే కల్లోలాగ్ని జనించింది. దాని జ్వాలలు, సృష్టించిన వినాశకర సంఘటనలు నేడు మానవ చరిత్రలోని అత్యంత బాధాకరమయిన అధ్యాయంగా నిలిచిపోయ్యాయి.

— ప్రకాశకులు

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

అల్లాహ్‌కు స్తోత్రం, కృతజ్ఞతాభివందనాలు. ఆయన మనల్ని సృష్టించాడు! బుద్ధీజ్ఞానాలు ప్రసాదించాడు. మంచి చెడుల విచక్షణా జ్ఞానమూ ప్రసాదించాడు. మన జీవనపథ బోధనకు, మన మార్గదర్శకత్వానికిగాను ఎంతో ఉత్తములయిన తన దాసుల్ని పంపించాడు సజ్జనులయిన ఆ దైవదాసులపై దైవం శాంతి కలుగజెయ్యుగాక. వారు మానవాళికి మానవతను బోధించారు! మంచి మనుషులుగా జీవించడం నేర్పారు. మానవుని జీవిత పరమార్థం ఏమిటో తెలియజేశారు. ఏ సూత్రాలనయితే అవలంబించి మనిషి ఇహలోకంలో సుఖశాంతులు, పరలోకంలో మోక్షం పొందగలడో వాటిని చూపారు, బోధించారు.

## ప్రకృతి సిద్ధాంతం

సోదరీ సోదరులారా! ఈ విశ్వాన్ని సృష్టించిన దైవం. భూమిని పాన్పుగా పరచి దానిపై మానవుల్ని నివసింపజేసిన దైవం, ఏదో గుడ్డిగా అల్లాటప్పాగా పనిచేసే దేవుడు కాడు; ఆయన రాజ్యం చీకటి రాజ్యమూ కాదు, ఆయన గుడ్డి రాజు కూడా కాడు. ఈ సర్వ సృష్టిపై తన దైవత్వాన్ని చెలాయించడానికి ఆయిన శాశ్వతమయిన చట్టాలు, పటిష్టమైన నియమాలు, దృఢమయిన నిబంధనలు చేశాడు. ఆయన చట్టానికి ఏ విధంగా సూర్యచంద్ర నక్షత్రాదులు కట్టుబడి ఉన్నాయో, ఏ విధంగా

గాలి, నీరు, వృక్షాలు, పశువులు కట్టుబడి ఉన్నాయో అలాగే నేనూ, మీరూ, సమస్త మానవులం కూడా ఆయన చట్టానికి కట్టుబడి ఉన్నాం మన జనన మరణాలను, బాల్యం, యవ్వనం, వార్ధక్యాలను మన ఉచ్ఛ్వాస నిశ్వాసాలను, మన జీర్ణాశయం వ్యవస్థను, రక్తప్రసరణను, మన ఆరోగ్యం అనారోగ్యాలను ఆయన నియమాలు ఎలా పొరపొచ్చాలు లేకుండా నిశ్చలంగా నడుస్తున్నాయో, అలాగే మన చరిత్ర ఎగుడు దిగుళ్ళను, మన ఉత్థాన పతనాలను. మన వృద్ధివినాశాలను, మన వ్యక్తిగత, జాతీయ, దేశీయ భవితవ్యాలను కూడా ఆయన చేసిన మరో శాసనం నడిపిస్తోంది. ఈ శాసనం కూడా ఎలాంటి హెచ్చు తగ్గులు లేని నిశ్చలమయిన శాసనం. మనిషి ముక్కుకు బదులు కళ్ళతో శ్వాసించడం, ఆహారం జీర్ణాశయానికి బదులు హృదయంలో జీర్ణం కావడం ఎలా అసంభవమో, దైవ నియమం ప్రకారం ఒక జాతిని పతనం వైపుకు తీసుకుపోయే మార్గం దాన్ని ప్రగతి వైపుకు తీసుకుపోవడం కూడా అసంభవమే. అగ్ని ఒకరికి వేడిని మరొకరికి చల్లదనాన్ని ఇవ్వటం జరగనప్పుడు, చెడు చేష్టలు— దైవ నియమం రీత్యా చెడువయినవి— కొందరిని పతనంపాలు చేసేవిగానూ, మరికొందరిని పైకి లేవనెత్తేవిగానూ కాపొందజాలవు. మానవుల అదృష్ట దురదృష్ట నిర్మాణం కోసం దేవుడు నిర్ణయించిన సూత్రాలు ఒకరు మార్చదలిస్తే మారనూ లేవు; వాటిని తప్పించదలచినా సాధ్యపడదు. వాటికి ఒకరి పట్ల శత్రుత్వం, మరొకరి పట్ల మినహాయింపు అనేది లేదు.

ఈ దైవ నియమంలోని మొట్టమొదటి, ముఖ్యమయిన ప్రకరణ ఇది :

"ఆయన నిర్మాణాన్ని ఇష్టపడతాడు. విచ్ఛిన్నాన్ని ఏ మాత్రం ఇష్టపడడు."

యజమాని అయినందు వల్ల దేవుడు తన ప్రపంచంలో ఏర్పాట్లన్నీ సవ్యంగా జరగాలనీ, దాన్ని ఇతోధికంగా తీర్చిదిద్దాలనీ, తాను ప్రసాదించిన సాధనా సంపత్తి. శక్తిసామర్థ్యాలు ఇతోధికంగా సద్వినియోగం కావాలనీ కోరుకుంటాడు. తన ఈ ప్రపంచాన్ని చెరిపివెయ్యడాన్ని, నాశనం చెయ్యడాన్ని, ఇంకా దాన్ని అవ్యవస్థకు, అక్రమాలకు, అత్యాచారాలకు గురిచెయ్యమన్ని ఆయన ఎన్నటికీ సమ్మతించడు అలా సమ్మతిస్తాడని మనం ఏ విధంగానూ ఆశించలేము.

మానవుల్లో ఎవరయితే ప్రపంచ వ్యవహారాల నిర్వహణ కోసం అభ్యర్థులుగా ముందుకు వచ్చారో, వారిలో నిర్మాణాత్మకమయిన యోగ్యతలు ఉన్నవారే దేవుని దృష్టిలో అర్హులుగా నిలుస్తారు. వారికే ఆయన ప్రపంచపు వ్యవహారాలను చూసుకునే అధికారాలను హస్తగతం చేస్తాడు.

ఆ తర్వాత వారు ఎంత వరకు 'నిర్మాణం' చేశారు, మరెంతవరకు 'విచ్ఛిన్నం చేశారు అని ఆయన గమనిస్తూ ఉంటాడు. వారు చేసే 'నిర్మాణం,' వారు చేసిన 'విచ్ఛిన్నం' కన్నా అధికంగా ఉన్నంత కాలం, ఇంకా, వారికంటే అధికంగా 'నిర్మాణం' చెయ్యగలవారు, వారికంటే తక్కువగా 'విచ్ఛిన్నం' చేసేవారు రంగంలో లేనంత కాలం వారు ఎన్ని తప్పులు చేసినా మరెన్ని చెడులకు పాల్పడినా ప్రపంచ కార్యాల నిర్వహణను దేవుడు వారి చేతుల్లోనే ఉంచుతాడు. అయితే వారి ద్వారా

'నిర్మాణం' తక్కువగాను, 'విచ్ఛిన్నం' ఎక్కువగానూ జరగనారంభించగానే దేవుడు వారిని తొలగించి ఇతర అభ్యర్థులకు ప్రపంచ వ్యవహారాలను అవే షరతులపై అప్పగిస్తాడు.

## తోటమాలి

ఈ దైవ నియమం ప్రకృతికి సన్నిహితమైందని, సమంజసమయిందని మీ బుద్ధి కూడా సాక్ష్యమిస్తుంది. మీలో ఎవరికైనా ఒక తోట ఉంది, అతను ఆ తోటను ఒక మాలికి అప్పజెప్పినట్లయితే మాలి ద్వారా అతను ఆశించే మొట్టమొదటి విషయం ఏమిటో మీరే చెప్పండి. మాలి, తోటను బాగుచేయాలని, చెడగొట్టకూడదని తప్ప ఆ యజమాని మరేం కోరుకుంటాడు? తన తోట సాధ్యమయినంత మంచి స్థితిలో ఉండాలనీ ఇతోధికంగా వృద్ధిచెందాలనీ, ఇంకా అది, అందంగా, పరిశుభ్రంగా ఉండాలని, అత్యధికంగా ఉత్పత్తి పెరగాలనీ అతను తప్పక కోరుకుంటాడు. ఏ తోటమాలి అయితే కష్టపడి, మనస్సు లగ్నం చేసి, చక్కగా సమర్ధవంతంగా తన తోటను బాగుచేస్తున్నాడో, దానిలో బాటలను అందంగా తీర్చిదిద్దుతున్నాడో, మేలి జాతి చెట్లను పెంచుతున్నాడో, నాసి రకం చెట్లను, కలుపును తీసి పరిశుభ్రంగా ఉంచుతున్నాడో, ఇంకా తన తెలివితేటలతో మేలి రకం పువ్వులను, పండ్లను, పండిస్తున్నాడో అతని పట్ల తోట యజమాని ప్రసన్నుడవడం, అతనికి ఉన్నత హోదాలను ఇవ్వడం తప్పక జరుగుతుంది. కాని బాధ్యతాయుతంగా సేవ చేసే అలాంటి తోటమాలిని తీసివేయటం అతనికి సుతరామూ ఇష్టం ఉండదు.

కాని దీనికి భిన్నంగా తోటమాలి చేతకానివాడయ్యాడు. పని దొంగ. తెలిసో తెలియకో తోటను నష్టపరుస్తున్నాడు. తోటంతా చెత్తకుండీలా తయారయింది. నడిచే బాటలు చెరిగి పోయ్యాయి. నీరు కొన్ని చోట్ల వృథాగా పారుతుంటే, మరికొన్ని మడులు ఎండిపోతున్నాయి. ముళ్ళ పొదలు, కలుపు మొక్కలు దట్టంగా పెరిగిపోతున్నాయి. పండ్ల చెట్లను, పూల మొక్కల్ని నిర్దాక్షిణ్యంగా నరికివెయ్యడం జరుగుతోంది. మంచి చెట్లు మోడుబారిపోతున్నాయి. పిచ్చి పొదలు ఏపుగా పెరిగిపోతు న్నాయి. ఇలాంటి పరిస్థితిలో తోట యజమాని అలాంటి మాలిని ఎలా సహించగలడు ? మీరే యోచించండి : ఎలాంటి సిఫారసు ఏ వినతీ విన్నపాలు, ఏ విధమయిన వినయవినమ్రతలు, ఏ వంశపారంపర్యపు హక్కులు, ఏ స్వయంకల్పిత హక్కులు— వేటి కారణంగానయినా సరే తన తోటను ఇలాంటి మాలికి అప్ప గించేందుకు ఎవడయినా సిద్ధమవుతాడా ? మహా అయితే అతను తోటమాలికి ఒక వార్నింగ్ ఇచ్చి మరో అవకాశం మటుకు కల్పించవచ్చు. కాని వార్నింగ్ ఇచ్చినప్పటికి తోట మాలి కళ్ళు తెరవకపోతే, తోటను నాశనం చేస్తూనే ఉంటే యజమాని అతని మెడపట్టి బయటికి గెంటి మరో మాలిని నియమించడం తప్ప గత్యంతరం ఏముందీ ?

యోచించండి. ఓ చిన్న తోట విషయంలోనే మీరు ఇలాంటి పద్ధతి అవలంబిస్తారు. ఈ విశాలమయిన ఈ భూమిని, దానిపై ఉన్న అపార వస్తుసామగ్రిని మానవుల అధీనం చేసి, తన భూమండలంపై, దాని వస్తువులపై వారికి విస్తృతాధికారాలు ఇచ్చిన దేవుడు, మీరు దాన్ని బాగుచేస్తున్నారా లేక చెడగొడు

తున్నారా అనే విషయాన్ని ఎలా ఉపేక్షిస్తాడు? మీరు నిర్మాణమే చేస్తున్న పక్షంలో ఆయన మిమ్మల్ని తొలగించటానికి ఏ కారణమూ లేదు. కాని మీరు నిర్మాణం చేయకుండా బ్రహ్మాండమైన ఈ తోటను సర్వనాశనం చేస్తూ ఉంటే, దేవుడు తన తోటపై మీ హక్కు దేన్నీ ఆమోదించడు — ఆ హక్కును మీరు మీ ఇష్టానుసారం ఎంతటి బలమయిన అధారాలతో నిర్మించుకున్నట్లు భావించినా సరే. హెచ్చరించి, మేల్కొనేందుకు రెండు, మూడు అవకాశాలు కల్పించి, చివరికి ఆయన మిమ్మల్ని తోట నిర్వహణ నుంచి తొలగించికాని వదలిపెట్టడు.

మానవుల మధ్య ఒక తోట యజమాని దృక్కోణం, తోట మాలి దృక్కోణానికి ఏ విధంగా పొసగదో, అదే విధంగా ఈ విషయంలో దేవుని దృక్పథం, మానవుల దృక్పథానికి పూర్తిగా భిన్నమయింది. ఉదాహరణకు ఒక తోటమాలి వంశం రెండు, మూడు తరాల నుంచి ఒక వ్యక్తి యొక్క తోటలో పనిచేస్తోంది, వాళ్ళ తాత, ముత్తాతలను యోగ్యతా సామర్థ్యాల కారణంగా అక్కడి నియమించడం జరిగింది. వారి సంతానం కూడా బాగానే పని చేసింది. అప్పుడు వారిని అనవసరంగా తొలగించి కొత్తవాణ్ణి పెట్టవలసిన అవశ్యకత లేదని తోట యజమాని భావించాడు. వీరు కూడా పని సక్రమంగా చేస్తున్నప్పుడు, ఇతరులకన్నా వీరికే తోటపై ఎక్కువ అధికారం ఉంటుంది. ఆ విధంగా ఈ వంశం తోటలో పాతుకుపోయింది. కాని ఇప్పుడా వంశంలో ఉన్నవారు అసమర్థులు, అవివేకులు. పని దొంగలు బాధ్యతారహితులు. తోట పని చేసే ఎలాంటి సామర్థ్యమూ వారిలో లేదు. తోటను సర్వనాశనం చేస్తున్నారు. పైగా వారు ఈ

తోటలో తమ తాత ముత్తాతల నాటి నుంచి ఉంటున్నామని, మొట్టమొదట ఈ తోట తమ ముత్తాత చేతిమీదుగానే అభివృద్ధిలోనికి వచ్చిందని, అందుచేత దానిపై తమకు వంశపారంపర్యపు హక్కులున్నాయనీ, తమను తొలగించి ఇతరుల్ని నియమించడం ఏ విధంగానూ ధర్మసమ్మతం కాదని వాదిస్తారు. ఇదీ అసమర్థులయిన ఆ తోటమాలుల దృక్పథం.

మరి తోట యజమాని దృక్పథం కూడా ఇలాగే ఉంటుందా ? ఆయన ఈ విధంగా చెప్పాడు :

"తోట నిర్వహణ సక్రమంగా ఉండటమే నాకు ముఖ్యం. ఈ తోట మీ ముత్తాత కోసం వేయలేదు. మీ ముత్తాతను తోటలో పాలేరుగా మాత్రమే నియమించాను. దానిపై మీకేమయినా హక్కులుంటే అవి, మీరు అందించే సేవ, మీ సామర్థ్యాలకు లోబడి ఉన్నాయి. మీరు తోటను బాగుపరుస్తున్నంత వరకూ మీ హక్కులన్నింటినీ గౌరవించడం జరుగుతుంది. పూర్వపు మాలులు అంటే నాకేమయినా శత్రుత్వమా — వారు తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహించినా వారిని అనవసరంగా తీసివేసి కొత్తవారిని నియమించి పరీక్షించడానికి? తోట నిర్వహణ కోసం నియమించబడిన మీరు దానిని నాశనం చేస్తూనే ఉన్నప్పుడు మీ హక్కుల్ని వేటినీ నేను సమ్మతించను, ఇతర అభ్యర్థులున్నారు ; వారికే ఈ తోట నిర్వహణా అధికారం ఇస్తాను. మీరు వారి క్రింద సేవకులై ఉండవలసి వస్తుంది. అప్పటికీ మీరు మేల్కొనకపోతే, క్రింది స్థాయివారిగా కూడా మీరు దేనికీ పనికిరారని తేలిపోతే ఇంకా, తోటను చెరచేవారుగానే

రుజువయితే మిమ్మల్ని అక్కడ నుంచి కూడా తొలగిస్తాను. మీ స్థానంలో సేవకులుగా కూడా ఇతరుల్ని తెచ్చి నియమిస్తాను"

## జాతుల ఉత్థాన పతనాలు

తోట యజమాని దృక్పథం, తోటమాలి దృక్పథాల మధ్య ఉన్న ఈ వ్యత్యాసమే సరిగ్గా ప్రపంచ యజమాని దృక్పథానికి, ప్రపంచవాసుల దృక్పథానికీ వర్తిస్తుంది. ప్రపంచంలోని వివిధ జాతులు ఏ ప్రాంతాల్లోనైతే నివసిస్తున్నారో వారు, "ఈ ప్రాంతం మా జన్మభూమి. తరతరాల నుంచి మేము, మా తాత ముత్తాతలు ఇక్కడ నివసిస్తూ వస్తున్నాము. ఈ దేశంపై మాకు జన్మతః సంక్రమించిన హక్కులున్నాయి. అందువల్ల ఇక్కడ మా పరిపాలనే సాగాలి. బయటి నుంచి వచ్చి ఇక్కడ అధికారం చెలాయించటానికి ఇతరులెవ్వరికీ హక్కు లేదు" అని వాదిస్తారు. భూమి యజమాని, దేవుడు. వారి జాతీయ హక్కుల్ని కాదనడం లేదు. అయితే ప్రతి దేశంపై ఆ దేశవాసులకు జన్మహక్కు ఉందన్న వాదనను, ఎలాంటి పరిస్థితిలోనూ వారికి దాన్నుండి దూరం చెయ్యడం జరగరాదన్న దృక్పథాన్ని మాత్రం ఆయన అంగీకరించడు. ఆయనయితే ఒక జాతి తన దేశంలో ఏం చేస్తున్నదో గమనిస్తాడు. అది నిర్మాణం, సంస్కరణలు చేస్తూ ఉంటే, అది తన శక్తులను దేశ సంస్కరణ ప్రగతుల కోసం వినియోగిస్తుంటే, చెడుల పెరుగుదలను అరికట్టడం, మంచి పనుల వికాసానికి తోడ్పటంలో నిమగ్నమయి ఉంటే, విశ్వ ప్రభువు ఆ జాతితో: "ఇక్కడి పరిపాలనా వ్యవహారం మీ చేతు

ల్లోనే ఉంచడానికి మీకు అర్హత ఉందన్న విషయంలో సందేహం లేదు పైగా, మీరు పూర్వం నుంచీ ఇక్కడ నివసిస్తూ ఉన్నారు, సమర్థవంతులు కూడా అందువల్ల ఇతరుల కన్నా మీ హక్కుకే ప్రాధాన్యత ఉంది" అని అంటాడు.

కాని వ్యవహారం దీనికి భిన్నమైనదయితే నిర్మాణం అన్నదే లేదు. అంతా విచ్ఛిన్నమే జరుగుతోంది. మంచి పనులు అసలే లేవు. దేవుని భూమిపై సర్వత్రా చెడులే వ్యాపిస్తున్నాయి. దైవం సృష్టించినదంతా నిర్దాక్షిణ్యంగా నాశనం చెయ్యడం జరుగుతోంది. దాన్ని ఏ మంచి పనికీ వినియోగించడం జరగడం లేదు. ఇలాంటి పరిస్థితిలో ఆ ప్రజలకు కనువిప్పు కలగాలని, వారు తమ వైఖరిని సరిదిద్దుకోవాలని దేవుడు మొదటి కాస్త తేలికగా, ఆ తరువాత కొంచెం కఠినంగా చురక అంటిస్తాడు. అప్పటికీ ఆ జాతి దారికి రాకపోతే దాన్ని దేశ నిర్వహణ నుంచి తొలగించడం జరుగుతుంది, దానికంటే ఏ కాస్త మెరుగయిన యోగ్యతలు గలదయినా అలాంటి మరో జాతికి అక్కడి పాలనాధికారాన్ని హస్తగతం చెయ్యడం జరుగుతుంది.

ఈ వ్యవహారం అంతటితో ముగియదు. పాలితులుగ మారిన తరువాత కూడా దేశ ప్రజలు తమలో కొంత మేరకయినా యోగ్యతలూ, అర్హతలు ఉన్నట్లు నిరూపించలేకపోతే, తమ వల్ల ఇక ఎలాంటి నిర్మాణం జరగదని, విచ్ఛిన్నమే సంభవిస్తుందని తమ ఆచరణ ద్వారా వ్యక్తపరుస్తుంటే, దేవుడు ఆ జాతిని సమూలంగా తుడిచివేసి వారి స్థానంలో ఇతరుల్ని తెచ్చి నిలబెడతాడు. ఈ విషయంలో దేవుని దృక్పథం సదా తోట యజమాని దృక్పథంతో పోలి ఉంటుంది. ఆయన తన భూమికి సంబం

ధించిన హక్కుల కోసం వాదించే అభ్యర్థుల వంశపారంపర్యపు హక్కుల్ని లేదా జన్మ హక్కుల్ని చూడడు, వారిలో ఎవరు ఎక్కువగా "నిర్మాణం" చేసే సామర్థ్యం కలిగి ఉన్నారో, ఇంకా "విచ్ఛిన్నం" వైపుకు తక్కువగా మొగ్గుచూపుతారో అని చూస్తాడు. ఈ ప్రాతిపదికపై ఒక కాలంలో ఉండే అభ్యర్థులలో ఎవరు యోగ్యులుగా కనిపిస్తారో దైవం వారినే ఎన్నుకోవడం జరుగుతుంది. వారిలో "విచ్ఛిన్నం" కన్నా, "నిర్మాణమే" అధికంగా ఉన్నంత వరకు, లేదా వారికన్నా ఎక్కువ "నిర్మాణం," తక్కువ "విచ్ఛిన్నం" చేసేవారు రంగంలో లేనంత వరకూ పాలనాధికారం వారి చేతుల్లో ఉంటుంది.

## మన దేశం

నేను ఉదాహరించిన ఈ సూత్రంపైనే దేవుడు సదా తన ప్రపంచంలో పరిపాలనా వ్యవహారాన్ని నడిపించాడని చరిత్ర సాక్ష్యం పలుకుతోంది. ఎంతో దూరం ఎందుకు? స్వయంగా ఈ దేశ చరిత్రనే చూడండి. ఇక్కడ పూర్వం ఉండిన జాతులలో నిర్మాణాత్మక శక్తి అంతమయినప్పుడు దేవుడు ఆనాటి జాతులలో అందరికంటే ఎక్కువ సామర్థ్యం గల ఆర్యులకు ఇక్కడ పరిపాలించే అవకాశాన్నిచ్చాడు. వారిక్కడకు వచ్చి గొప్ప నాగరికతకు పునాదులు వేశారు. అనేక శాస్త్రాలను, కళలను కనుగొన్నారు. భూమి నుంచి సంపదలను వెలికి తీసి వాటిని మానవ కళ్యాణానికై వినియోగించారు. "విచ్ఛిన్నం" కంటే ఎక్కువ "నిర్మాణమే" చేసి చూపెట్టారు. వారిలో ఈ శక్తిసామర్థ్యాలు ఉన్నంత వరకు చరిత్రలో ఎన్ని మెట్ట పల్లాలు

వచ్చినప్పటికీ ఈ దేశానికి పాలకులుగా వారే స్థిరమయ్యారు. ఇతర అభ్యర్థులు ముందుకు వచ్చినా వారిని వెనక్కి తోసి వెయ్యడం జరిగింది. ఎందుకంటే ఆనాటి పరిపాలకులుండగా ఇతర ఏ పరిపాలకుల అవసరమూ లేకపోయింది. వారిపై ఎప్పు డయినా చెదురుముదురుగా దాడులు జరిగినా అవి కేవలం హెచ్చరికల్లాంటివే. అంటే వారు కాస్త మార్గం తప్పినప్పుడు ఎవరినయినా పంపి వారిని హెచ్చరించడం జరిగిందన్న మాట. అయితే చివరికి వారు అపమార్గంలోనే కూరుకుపోయారు. వారు "నిర్మాణపు" పనులు తక్కువగానూ, "విచ్ఛిన్నపు" పనులు ఎక్కువగానూ చేయసాగారు. వారు నైతికంగా ఎంతో దిగజారి పోయారు. (దాని చిహ్నాలు ఇప్పటికీ మీరు వామ మార్గీయుల ఉద్యమంలో చూడవచ్చు). వారు మానవులను విభజించి స్వయంగా తమ సమాజాన్ని వర్ణాలుగా. కులాలుగా చీల్చివేసి తమ సామూహిక జీవితాన్ని అంతస్తులలో విభజించారు. దాని ప్రతి మెట్టుపై కూర్చున్నవాడు, పై మెట్టుపై కూర్చున్నవాడికీ దాసునిగా, క్రింది మెట్టుపై కూర్చున్నవాడికి దేవునిగా రూపొం దాడు. వాడు కోటాను కోట్ల మానవులపై ఘోరంగా అన్యాయ జరిపాడు. ఇప్పటికీ అది అస్పృశ్యత రూపంలో ఉంది సామాన్య ప్రజలకు విద్యా ద్వారాలను మూసివేశారు. వా పండితులు జ్ఞాన నిధులపై నాగు పాములై కూర్చుండిపోయారు. వారి పరిపాలకులు స్వయంగా కల్పించుకున్న హక్కుల్ని ఇతరు లపై బలవంతంగా రుద్ది వాటిని పొందడం, ఇతరుల శ్రమతో భోగభాగ్యాల్లో తేలియాడేవారు. ఇదే తప్ప వారికి ఇతర పనేమి లేకపోయింది. ఈ పరిస్థితుల్లో దేవుడు వారి నుండి దేశ పరి

పాలనా వ్యవహారాన్ని లాక్కున్నాడు. తరువాత మధ్య ఆసియా లోని జాతులకు ఇక్కడ పరిపాలించే అవకాశాన్నిచ్చాడు. ఆ జాతులు ఇస్లామీయ ఉద్యమంతో ప్రభావితమయి ఉత్తమ శక్తి సామర్థ్యాలతో అలరారుతూ ఉన్నారప్పుడు.

## ముస్లిం పరిపాలకులు

వీరు శతాబ్దాల తరబడి ఇక్కడ పాలకులుగా విరాజిల్లారు. స్వయంగా ఈ దేశ ప్రజలు కూడా అనేక మంది ఇస్లామ్ స్వీకరించి వారితోపాటు కలసిపోయారు. వీరు అనేక విచ్ఛిన్నపు పనులు కూడా చేశారనడంలో సందేహం లేదు. అయితే వారు చేసిన విచ్ఛిన్నపు పనుల కంటే నిర్మాణపు పనులే అధికం. భారత దేశంలో అనేక శతాబ్దాల వరకు నిర్మాణపు కార్యాలు ఏవి జరిగినా అవి వారి చేతులమీదుగానో లేదా వారి ప్రభావం వల్లనో జరిగినవే వారు విద్యా కాంతిని నలుదిశలా ప్రసరింపజేశారు. భావాల సంస్కరణ చేశారు. నాగరికతను, సామాజిక వ్యవస్థను ఎంతో తీర్చిదిద్దారు, దేశంలోని వనరులను, సాధనా సంపత్తులను వారు తమ సమకాలీన ప్రమాణాల రీత్యా మంచి కోసం వినియోగించారు. శాంతిభద్రతల రీత్యా, న్యాయ రీత్యా ఉత్తమ వ్యవస్థను నెలకొల్పారు. అది ఇస్లామ్ యొక్క అసలు ప్రమాణానికి సరితూగకపోయినా పూర్వపు పరిస్థితి కంటే, చుట్టు ప్రక్క దేశాల పరిస్థితి కంటే ఎంతో ఉన్నతంగా ఉండింది.

ఆ తరువాత వారు కూడా పూర్వపు పరిపాలకుల్లా అప మార్గం పట్టారు. వారిలోనూ "నిర్మాణపు" శక్తిసామర్థ్యాలు

సన్నగిల్లసాగాయి. "విచ్ఛిన్నపు" ధోరణులు అధికం కాసాగాయి. వారూ నిమ్నోన్నతా భేదభావాలను, కుల వివక్షతను, వర్గ విభజనలను సృష్టించి స్వయంగా తమ సమాజాన్నే చీల్చివేశారు. దాని వల్ల అనేక నైతిక, రాజకీయ, సాంస్కృతిక నష్టాలు సంభవించాయి. వారు కూడా న్యాయం తక్కువగా, దౌర్జన్యం ఎక్కువగా చేయనారంభించారు, వారూ పరిపాలనా బాధ్యతల్ని విస్మరించి దానివల్ల కలిగే స్వలాభాలపై, అదీ అధర్మమయిన లాభాలపై దృష్టి కేంద్రీకరించారు. వారూ నిర్మాణం, ప్రగతి సంస్కరణలను విడనాడి దైవం ప్రసాదించిన శక్తిసామర్థ్యాలను, సాధనా సంపత్తులను వృధా చేయసాగారు. ఒకవేళ వినియోగించినా జీవితాన్ని విచ్ఛిన్నం చేసే పనుల కోసమే వాటిని వినియోగించారు. శరీర సుఖాలకు, భోగవిలాసాలకు ఎంతగా లోనయ్యారంటే, చివరిసారిగా పరాజయం పొంది, ఆ పరిపాలకులు ఢిల్లీ ఎర్ర కోట వదలిపెట్టవలసి వచ్చినప్పుడు వారి రాకుమారులు (ఆనాడు కాబోయే పరిపాలకులు) ప్రాణాలు కాపాడుకునేందుకు పరిగెత్తనూలేకపోయారు. ఎందుకంటే వారసలు నేలపై నడవడమే మానుకున్నారు.

సాధారణ ముస్లిమ్‌ల నైతిక పతనం ఏ మేరకు చేరిందంటే సామాన్య ప్రజానీకం మొదలుకొని గొప్ప గొప్ప బాధ్యతాయుతులయిన వ్యక్తుల వరకూ ఏ ఒక్కరిలోనూ తమ పట్ల తప్ప మరే విషయం పట్లయినా విశ్వాసం లేకుండాపోయింది. అదే ఉంటే వారు తమ ధర్మాన్నీ, తమ జాతిని, తమ దేశాన్ని అమ్ముకోవడానికి సిద్ధమయితే వారించగలిగి ఉండేది. వారిలో లక్షలాది సంఖ్యలో సైనిక వృత్తినే ఆశ్రయించేవారు పుట్టసాగారు. వీరి

పరిస్థితి పెంపుడు కుక్కలుగా తయారయింది. ఎవరయినా రొట్టె ముక్క పడేసి వారిని పెంచుకోవచ్చు. ఇష్టమయినవారు వారిని వేటకై ఉపయోగించుకోవచ్చు. స్వయంగా వారి ద్వారానే వారి స్వదేశాన్ని జయిస్తూ ఉన్నటువంటి ఈ హీనస్థితి ఏ మాత్రమైనా అవమానకరమయిన విషయమా ? అన్న ఆలోచన కూడా వారికి కలగకుండా పోయింది. గాలిబ్ వంటి గొప్ప కవి సయితం అన్నాడు :

"తరతరాలుగా మా వంద తరాల వృత్తి ఈ సిపాయి వృత్తి"

ఈ మాట పలుకుతున్నప్పుడు అంతటి మహా కవులకు జీవనోపాధి కోసం సైనికుడిగా పనిచెయ్యడం గర్వించదగిన విషయం కాదని, ఎక్కడయినా మునిగి చావవలసిన విషయమని ఏ మాత్రం సిగ్గు కలగలేదు.

వారి పరిస్థితి ఇంతకా దిగజారిన తర్వాత దైవం వారిని తొలగించాలని నిర్ణయించుకున్నాడు. భారతదేశ పరిపాలనా బాధ్యత ద్వారాలు కొత్త అభ్యర్థుల కోసం తెరచుకున్నాయి. ఈ సందర్భాన నలుగురు అభ్యర్థులు రంగంలోకి దిగారు. వారు మరాఠీలు, సిక్కులు, ఆంగ్లేయులు, కొందరు ముస్లిమ్ భూస్వాములు. మీ కళ్ళకున్న జాతీయ దురభిమానపు అద్దాల్ని తీసి ఆనాటి చరిత్రను ఆ తర్వాత సంభవించిన సంఘటనల్ని న్యాయంగా పరిశీలించండి ఆంగ్లేయుల్లో ఉన్న నిర్మాణపు శక్తి సామర్థ్యాలు ఆ అభ్యర్థుల్లో ఎవరిలోనూ లేవని స్వయంగా మీ అంతరాత్మే సాక్ష్యమిస్తుంది. అలాగే ఆంగ్లేయుల్లో ఉన్న విచ్ఛిన్న గుణం కన్నా అనేక రెట్లు అధిక విచ్ఛిన్న గుణం మరాఠా, సిక్కు,

ముస్లిమ్ అభ్యర్థుల్లో ఉండింది. ఆంగ్లేయులు చేసిన 'నిర్మాణం' వారిలో ఎవరూ చేసేవారు కాదు. ఆంగ్లేయులు చేసిన "విచ్ఛిన్నం" కన్నా అత్యధిక విచ్ఛిన్నం ఇతర అభ్యర్థులు చేసి ఉండేవారు. ప్రత్యేకంగా ఆంగ్లేయుల్నే చూస్తే వారిలో అనేక కోణాల నుండి ఎన్నో చెడులు మీకు కనిపిస్తాయి. కాని ఆంగ్లేయుల్ని ఇతరులతో పోల్చి చూస్తే వారి సమకాలికుల కంటే వారిలో చెడు ఎంతో తక్కువగాను, మంచి అన్నది ఎంతో ఎక్కువగానూ కనిపిస్తాయి. ఈ కారణంగానే, మానవులు అధర్మంగా కల్పించుకున్న సిద్ధాంతం— "దేశాన్ని నిర్మించినా, విచ్ఛిన్నం చేసినా దేశం స్వయంగా ఆ దేశవాసులదే" అనేదాన్ని దేవుని శాసనం మరోసారి రద్దు చేసింది.

## దైవ శాసనం

చరిత్ర ఇచ్చిన తిరుగులేని తీర్పు ద్వారా, దైవ శాసనం— దేశం దైవానిదేనని, దాని పరిపాలనా వ్యవహారాన్ని ఎవరికి అప్పగించాలో నిర్ణయించే హక్కు ఆయనకే ఉందనీ రుజువుచేసింది. ఆయన నిర్ణయం, జాతి, వంశం, తాత ముత్తాతల హక్కు ప్రాతిపదికపైగాక, శ్రేయస్సు అనేది ఏ పరిపాలనలో ఉందనే విషయంపై మాత్రమే ఆధారపడి ఉంటుంది.

> ఇలా పలకండి : "ఓ అల్లాహ్ ! సార్వభౌమాధికారానికి ప్రభూ ! నీవు కోరినవారికి ప్రభుత్వాధికారాన్ని ప్రసాదిస్తావు ; నీవు కోరినవారి నుండి దాన్ని లాక్కుంటావు, నీవు కోరినవారికి గౌరవాన్ని ప్రసాదిస్తావు ; నీవు కోరిన

వారిని పరాభవంపాలు చేస్తావు, శుభాలు నీ అధీనంలోనే ఉన్నాయి. నిస్సందేహంగా నీకు అన్నింటిపైనా అధికారం ఉంది." (దివ్య ఖుర్‌ఆన్ — 3 : 26)

ఈ విధంగా దేవుడు వేలకొలది మైళ్ళ నుండి ఒక జాతిని తీసుకువచ్చాడు. మన దేశంలో వీరి సంఖ్య ఎన్నడూ మూడు నాలుగు లక్షలకు మించలేదు. వారు ఇక్కడి సాధనాసంపత్తుల ద్వారా, వ్యక్తుల ద్వారా ఇక్కడి హిందూ, ముస్లిమ్, సిక్కు అన్ని వర్గాల శక్తిని లోబరచుకొని దేశ పాలనాధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. ఇక్కడి కోట్లాది ప్రజలు గుప్పెడు ఆంగ్లేయులకు లొంగిపోయారు. ఒక్కొక్క ఆంగ్లేయుడు ఒంటరిగానే ఒక్కొక్క జిల్లాను పాలించాడు. అతని జాతిలోని మరే వ్యక్తి సహాయం లేకుండానే అతనీ పని చేశాడు. ఈ మొత్తం కాలంలో భారత దేశీయులు ఏదయినా చేస్తే కేవలం సేవకులుగానే పనిచేశారుగాని అధికారులుగా మాత్రం కాదు.

ఆంగ్లేయులు ఇక్కడ ఉన్నంత కాలం ఇక్కడ జరిగిన నిర్మాణపు పనులన్నీ ఆంగ్లేయులచేతనో లేదా వారి ప్రభావం వల్లనో జరిగాయని అంగీకరించవలసి ఉంటుంది. అంగీకరించక పోతే అది ఓ యదార్థాన్ని నిరాకరించడమే అవుతుంది. వారు మన దేశంలో అడుగిడినప్పటి పరిస్థితితో నేటి పరిస్థితిని పోల్చి చూస్తే 'విచ్ఛిన్నం' జరిగినా ఇతోధికంగా 'నిర్మాణపు పనులూ' జరిగాయన్న వాస్తవాన్ని మనం త్రోసిపుచ్చలేము. ఈ పనులు ఈ దేశవాసుల చేతుల్లో అయితే జరిగి ఉండేవని ఏ మాత్రం ఆశించలేము. కాబట్టి 18వ శతాబ్ది మధ్యలో దైవ నియమావళి చేసిన ఆ నిర్ణయం, తప్పు నిర్ణయం ఎంత మాత్రం కాదు.

ఇప్పుడు చూడండి. ఆంగ్లేయులు తాము చేయగలిగిన 'నిర్మాణం' అంతా చేశారు. చెయ్యగలిగే 'నిర్మాణం'లో ఇక ఎలాంటి ప్రత్యేకమయిన పెరుగుదలకు అవకాశం లేదు. ఈ 'నిర్మాణం'లో అదనంగా వారు ఏమయినా చెయ్యగలిగితే అది ఇతరుల ద్వారా కూడా సాధ్యమే. కాని మరో వైపు వారి విచ్ఛిన్నపు పనులు విపరీతంగా పెరిగిపోయాయి. వారిక్కడ ఎంత కాలం ఉన్నా అంత కాలం 'నిర్మాణం' కంటే 'విచ్ఛిన్నమే' అధికంగా చేస్తారు— వారు చేసిన నేరాల జాబితా 'ఎంత నిడువయినదంటే' దాన్ని ఒక్క సమావేశంలో వివరించడం కష్టం. దాన్ని వివరించవలసిన అవసరం కూడా లేదు. ఎందువల్లనంటే అదంతా మన ముందు ఉంది— ఇప్పుడికవారిని ఇక్కడి పాలనా వ్యవహారం నుండి తొలగించడమే దైవ నియమావళి చేసే నిర్ణయం. వారెంతో విజ్ఞతను కనబరచారు, స్వయంగానే ఇక్కడ నుండి బుద్ధిగా వెళ్ళిపోవడానికి సిద్ధమయ్యారు. వెళ్ళకపోతే వారిని మెడపట్టి గెంటివేయవలసి వచ్చేది. ఎందుకంటే ఇక్కడి పరిపాలనా వ్యవహారాలన్నీ ఇప్పుడిక వారి చేతుల్లో కొనసాగనివ్వడానికి దేవుని తిరుగులేని శాసనాలు ఏ మాత్రం ఒప్పుకోవు.

## బోనులో మనం

ఈ కాలం దేని అంచులపై నేనూ మీరూ నిలబడి ఉన్నామో అది చరిత్రలో అత్యంత కీలకమయిన సందర్భాల్లో ఒక్కటి. ఎందుకంటే భూమికి అసలు యజమాని ఒక దేశంలో ఓ పరిపాలనను అంతమొందించి అక్కడ మరో పరిపాలనను ప్రవేశపెట్టే సందర్భం ఇది. ఇక్కడ అధికారం మార్పిడికి

సంబంధించిన వ్యవహారం నిర్ణయమవుతున్న తీరును చూచి దేశ పాలనా వ్యవహారాన్ని స్వయంగా దేశవాసులకు అప్పగించేందుకు చేయబడుతున్న ఈ తీర్పును చివరి తీర్పుగా భావించి మోస పోకూడదు దీన్ని మీరు సాధారణమైన విషయంగా బహుశా భావిస్తున్నారేమో— అంటే, బయటి నుండి వచ్చి పరిపాలించిన కొత్త పాలకులు ఇప్పుడు తిరిగి వెళ్ళిపోతున్నారు. గనుక దేశ పరిపాలనా వ్యవహారం దానంతట అదే స్వయంగా దేశవాసులకు లభించాలని మీరు భావిస్తూ ఉండవచ్చు. కాని దైవ నిర్ణయాలు ఇలా జరగవు. ఆయన ఈ కొత్తవాళ్ళను మొదట్లోనూ అకార ణంగా ఇక్కడకు తీసుకురాలేదు. ఇప్పుడూ అకారణంగా ఇక్కడి నుండి తీసుకెళ్ళడం లేదు. ఆయన మొదట్లోనూ మీ నుండి అల్లాటప్పాగా పరిపాలనా అధికారాలను లాక్కోలేదు. ఇప్పుడూ అల్లాటప్పాగా పరిపాలనా అధికారాలను మీకు అప్పగించ బోవడం లేదు. నిజం చెప్పాలంటే ప్రస్తుతం భారత దేశస్థులంతా ఈ పనికి అభ్యర్థులుగా నిలబడ్డారు. హిందువులు, ముస్లిములు, సిక్కులు అందరూ అభ్యర్థులే. వీరంతా మొదటి నుండే ఇక్కడ వసిస్తున్నారు. కనుక మొదటి అవకాశం వీరికి ఇవ్వబడుతోంది. యితే వీరికిది శాశ్వత నియామకం కాదు. కేవలం పరీక్షగా ఇవ్వబడుతున్న అవకాశం మాత్రమే. వాస్తవంగా వీరు తమలో విచ్ఛిన్నం కంటే నిర్మాణపు సామర్థ్యాలే అధికంగా ఉన్నాయని నిరూపిస్తే అప్పుడు వీరి నియామకం శాశ్వతమవుతుంది. లేదా వీరు 'నిర్మాణం' కంటే 'విచ్ఛిన్నం' ఎక్కువగా చేసి చూపిస్తే మళ్ళీ వీరిని ఈ దేశ పాలనా వ్యవహారం నుండి తొలగించడం తథ్యమని త్వరలోనే గ్రహిస్తారు. ఆ తరువాత చుట్టుపట్లనున్న

జాతులలో ఏదో ఒక జాతిని ఈ బాధ్యత కోసం ఎన్నుకోవడం జరుగుతుంది. అప్పుడు ఆ నిర్ణయానికి వ్యతిరేకంగా వీరు పెదవి విప్పి ఫిర్యాదు సయితం చేయలేరు. యావత్తు ప్రపంచం ముందు తమ అయోగ్యతను బయటపెట్టుకున్న తరువాత వీరు ఏ ముఖం పెట్టుకుని ఫిర్యాదు చేస్తారు ? ఒకవేళ వీరు లజ్జారహితంగా ఫిర్యాదు చేసినా వారి ఫిర్యాదులు ఆలకించేదెవరు ?

ఇప్పుడు కాస్త పరిశీలించండి. భారతవాసులైన హిందువులు, ముస్లిమ్‌లు, సిక్కులు ఈ పరీక్షలో దైవం ఎదుట ఎలాంటి శక్తి సామర్థ్యాలు, యోగ్యతార్హతలు, గుణగణాలు, ఘనకార్యాలు ప్రదర్శిస్తున్నారో గమనించండి. దేవుడు తన ఈ దేశ పరిపాలనా వ్యవహారాన్ని తిరిగి వీరికి అప్పగిస్తాడని వీరు ఏ లక్షణాల ఆధారంగా ఆశిస్తున్నారో కాస్త చూడండి. ఈ సందర్భంలో నైతిక న్యాయస్థానంలో హిందువులు, ముస్లిమ్‌లు, సిక్కులు యావన్మందిపై ఆరోపించబడిన నేరాల జాబితాను నేను నిర్మొహమాటంగా బట్టబయలు చేస్తే మీరు మరోలా భావించరని ఆశిస్తున్నాను. నా దేశస్థులు, నా జాతి సోదరుల లోపాలను ఎత్తిచూపించడం నాకూ సంతోషకరం కాదు. నిజానికి నా హృదయం రోదిస్తోంది. ఎందుకంటే ఈ లోపాల మూలంగా ఏ పరిణామాలనయితే రేపు వారు అనుభవించబోతున్నారో, ఆ పరిణామాలను నేను నేడు నా కళ్ళతో చూస్తున్నాను. ఈ లోపాలు వారిని ముంచివేస్తాయని నాకు భయంగా ఉంది, వాటి దుష్పరిణామాల నుండి నేనూ, మీరూ, ఎవరమూ తప్పించుకోలేము. అందువల్ల నేను బాధాపూరిత హృదయంతో వాటిని వివరిస్తు

న్నాను, వీనములున్నవారు విని శ్రేయోసంస్కరణలకై ఆలోచించాలి.

## మన స్థితి ఎలా ఉంది?

మన ప్రజల సాధారణ నైతిక పరిస్థితి ఎలాంటిదో మీరు స్వయంగా, మీ స్వీయ అనుభవాల పరిశీలనల ద్వారా అంచనా వెయ్యవచ్చు. అక్రమ లాభాలను ఆర్జించే విషయంలో, 'ప్రయోజనకరమయిన' అబద్ధం పలికే, 'లాభదాయకమయిన' మోసం చేసే విషయాల్లో, ఒకరి హక్కును కాజేయడం నైతికంగా తప్పని భావించి వెనుకంజవేసేవారు మనలో ఎంత మంది ఉన్నారు? చట్టం పట్టు నుండి తప్పించుకునే అవకాశం ఉన్నప్పుడు, కేవలం నైతిక భావనతో, ఒక నేరాన్ని, ఒక చెడును చెయ్యకుండా ఉండే వారు మనలో ఎంత మంది ఉన్నారు? ఎలాంటి స్వప్రయోజనమూ లభించే ఆశ లేనపుడు, ఇతరులకు మేలు చెయ్యాలనీ, సానుభూతితో, త్యాగభావంతో హక్కును అందజెయ్యాలన్న నిజాయితీతో మంచిగా వ్యవహరించేవారు మనలో ఎంత మంది ఉన్నారు? మన వ్యాపారస్తులలో మోసం, అబద్ధం, అక్రమ లాభాలకు దూరంగా ఉండే వ్యాపారులు ఎవరున్నారు? స్వంత లాభాలతోపాటు, కొనుగోలుదారుల ప్రయోజనం, దేశం, జాతి, ప్రయోజనాలను గురించి ఆలోచించేవారు మన పారిశ్రామికవేత్తలలో ఎంత మంది ఉన్నారు? ధాన్యం నిల్వచేస్తూ, దాన్ని మితి మీరిన ధరలకు అమ్ముతూ గడించే అత్యధిక లాభాల మూలంగా ఎన్ని లక్షలు, ఎన్ని కోట్ల మందిని ఆకలి బాధలకు గురిచేస్తున్నామో అని ఆలోచించేవారు మన భూస్వాముల్లో ఎంత మంది

ఉన్నారు? ఇతరుల హక్కులు కాజేయడం, అక్రమాలకు పాల్పడటం లాంటి విషయాల ప్రమేయంలేని సంపాదన కలవారు మనలోని శ్రీమంతుల్లో ఎంత మంది ఉన్నారు? బాధ్యతాయుతంగా, తమ వేతనాలు, జీతాలకు తగినట్టుగా పనిచేసేవారు మన శ్రామికుల్లో ఎంత మంది ఉన్నారు? లంచగొండితనం, దగాకోరుతనం, అత్యాచారం, మనసు నొప్పించడం, పని దొంగ వైఖరి, అధర్మ సంపాదన, అధికార దుర్వినియోగాలకు పాల్పడని వారు మన ప్రభుత్వ ఉద్యోగుల్లో ఎంత మంది ఉన్నారు? మన వకీళ్ళు, డాక్టర్లు, వైద్యులు, పాత్రికేయులు, ప్రకాశకులు, రచయితలు, ఇంకా మన 'జాతి సేవకు'లలో తమ స్వప్రయోజనాల కోసం అతి హేయమైన పద్ధతుల్ని అవలంబిస్తూ, ప్రజలకు మానసికంగా, నైతికంగా, ఆర్థికంగా, శారీరకంగా నష్టం కలిగిస్తూ కాస్తయినా సిగ్గుపడేవారు ఎంత మంది ఉన్నారు? మన జనాభాలో ఈ నైతిక కుష్టు నుండి సురక్షితంగా ఉన్నవారు కనకష్టంగా 5 శాతం ఉండవచ్చు. 3200 నిజానికి 95 శాతం మందికి ఈ వ్యాధి గట్టిగా చుట్టుకుందని అనడం బహుశా అతిశయోక్తి కాదేమో! ఈ విషయంలో హిందువులు, ముస్లిమ్‌లు, శిక్కులు, క్రైస్తవులు, హరిజనులు—వీరందరి మధ్య ఎలాంటి వ్యత్యాసం లేదు. అందరూ సమంగా రోగులే. అందరి నైతిక స్థితి ఎంత భయంకరంగా దిగజారిపోయింది. ఏ ఒక్క వర్గం స్థితి కూడా ఇతర వర్గాల స్థితి కంటే మెరుగ్గా లేదు. 081



నైతిక పతనం అనే మహమ్మారికి ప్రజల్లో అత్యధిక మంది గురయినప్పుడు సహజంగానే అది పెద్ద ఎత్తున సామూహిక రూపంతో వెలువడటం ప్రారంభమయింది. ఈ రాబోయే

తుఫానుకు తొలి సూచన మనకు యుద్ధం కారణంగా రైళ్ళలో రద్దీగా ప్రయాణాలు జరిగినప్పుడే కనిపించింది. అక్కడ ఒకే జాతి, ఒకే దేశ ప్రజలు అయిన ఆ ప్రయాణీకులు పరస్పరం దయావిహీనంగా, కఠిన హృదయంతో, స్వార్థంతో ప్రవర్తించిన తీరు మన జన సామాన్యంలో నైతికత ఎంత శీఘ్రంగా దిగజారి పోతున్నదో ప్రస్ఫుటం చేసింది.

అపై నిత్యావసర వస్తువుల కొరత, అధిక ధరలు. వీటికి తోడుగా అక్రమ నిల్వలు, దొంగ వ్యాపారం పెద్ద ఎత్తున ప్రారంభమయ్యాయి. తరువాత బెంగాల్‌లో భయంకరమయిన కృత్రిమ కరువు ఏర్పడింది. అందులో మనలోని ఒక వర్గం వారు తమ దేశస్థులే అయిన లక్షలాది ప్రజల్ని స్వప్రయోజనాల కోసం ఆకలితో మాడ్చి మాడ్చి చంపారు. ఇవన్నీ ప్రారంభ సూచనలు. ఆ తరువాత మనలో ఎంతో కాలంగా కుతకుతలాడుతున్న కుళ్ళు, నైచ్యం, పశుత్వం, మృగత్వాలు "లావా"గా ఒక్క సారి పెల్లుబికి ఇప్పుడు మతకల్లోలాల రూపంలో యావత్తు భారత దేశాన్ని ఆమూలాగ్రంగా భస్మీపటలం చేస్తున్నాయి. కలకత్తా అల్లర్ల తరువాత హిందువులు, ముస్లిమ్‌లు, సిక్కుల మధ్య కొత్తగా చెలరేగిన మతపరమయిన సంఘర్షణలో ఈ మూడు వర్గాలూ నీచాతి నీచమయిన లక్షణాలను ప్రదర్శిస్తున్నాయి. మనిషి ఎప్పుడయినా ఇలాంటి పనులకు కూడా పాల్పడతాడా అని ఊహించనయినా లేనంత నీచమయిన పనులకు మన నాగరిక ప్రజలు బహిరంగంగా ఒడిగడుతున్నారు.

పెద్ద పెద్ద ప్రాంతాల్లోని జనాభాకు జనాభాయే గూండాగా తయారయింది. వారు ఏ గూండా కూడా కలలోనైనా ఊహించని

చేష్టలకు పాల్పడుతున్నారు. ఈ దుర్మార్గులు చంటి పిల్లల్ని తల్లి గుండెపై పెట్టి నరికారు. మనుషుల్ని సజీవంగా కాల్చి చంపారు. భద్ర స్త్రీలను బహిరంగంగా వివస్త్రలుగా చేశారు. వేలాది మంది జనసమూహం ఎదుటవారిని ఘోరంగా చెరిచారు. తండ్రులు, భర్తలు, సోదరుల ముందే వారి కూతుళ్ళు, భార్యలు, అక్క చెల్లెళ్ళ మానాన్ని దోచుకున్నారు. ప్రార్థనాలయాలపై, మత గ్రంథాలపై కసి, కోపాన్ని వెళ్ళగక్కడానికి ఎంతో తుచ్ఛమయిన పద్ధతుల్ని అవలంబించారు. రోగుల్ని, గాయపడ్డవారిని వృద్ధుల్ని అతి నిర్దాక్షిణ్యంగా హతమార్చారు. ప్రయాణీకుల్ని పరిగెత్తుతున్న రైలు బండి నుండి పడవేశారు. సజీవ మానవుల అంగాంగాలను కోసి పడేశారు. నిరాయుధుల్ని, నిస్సహాయుల్ని జంతువుల్ని వేటాడినట్లు వేటాడారు పొరుగువాళ్ళు పొరుగువాళ్ళను దోచుకున్నారు. స్నేహితుల్ని స్నేహితులు మోసగించారు. రక్షణ ఇచ్చినవారు ఇచ్చిన రక్షణకు వ్యతిరేకంగా ప్రవర్తించారు, శాంతి భద్రతల్ని కాపాడేవారు (పోలీసులు, సైనికులు, న్యాయమూర్తులు) బహిరంగంగా అల్లర్లలో పాల్గొన్నారు. స్వయంగా వారు కల్లోలాన్ని సృష్టించారు. ఇంకా వారు తమ అండదండలతో కల్లోలాలను రేకెత్తించారు.

ఒక్క మాటలో చెప్పాలంటే హింసా, దౌర్జన్యం, హృదయ కాఠిన్యం, దయారాహిత్యం, దుర్మార్గం, నీచత్వం— వీటికి సంబంధించిన ఏ రకమయిన చెడునూ మన దేశవాసులు సామూహికంగా ఈ కొన్ని నెలల్లో ప్రయోగించకుండా వదలిపెట్టలేదు, ఇప్పటికీ వారి హృదయాల్లో ఉన్న అక్కసు ఇంకా పూర్తిగా తొలగిపోలేదు. ఇప్పటివరకు జరిగినదంతా ఇంతకంటే ఎంతో భారీ

ఎత్తున, ఇంతకంటే ఎంతో ఘోరంగా జరగనున్నదని పరిస్థితులు సూచిస్తున్నాయి.*

## ఇదీ దిక్సూచి

ఇదంతా కేవలం తాత్కాలికమయిన గందరగోళం వల్ల జరిగిందని మీరు భావిస్తున్నారా? ఒకవేళ మీరలా భావిస్తే అది మీ అపోహ మాత్రమే. దేశ జనాభాలో 95 శాతం ప్రజలు నైతికంగా అనారోగ్యానికి గురయ్యారని నేనింతకు ముందే చెప్పాను. ప్రజలు ఇంత అధిక సంఖ్యలో నైతికంగా దిగజారి ఉన్నప్పుడు జాతుల సామూహిక వైఖరి ఎలా బాగుపడుతుంది? అందువల్లనే హిందువులు, ముస్లిమ్‌లు, సిక్కులు— ఈ మూడు వర్గాల్లో సత్యం, న్యాయం, ధర్మాలకు ఎలాంటి విలువ లేకుండా పోయింది. నీతిమంతులు, నిజాయితీపరులు, మర్యాదస్తులు వీరి మధ్య అవివేకులుగా ముద్రపడ్డారు. చెడు నుండి వారించడం, మంచిని బోధించడం వీరి సమాజంలో సహించలేని నేరమయి పోయింది. ధర్మం, న్యాయాల మాటను వినడానికే వారు సిద్ధంగా లేరు.

వీరిలో ప్రతి వర్గం దాని హద్దులు మీరిన వాంఛలు, ప్రయోజనాల వకాల్తా పుచ్చుకునేవాళ్ళను, ఇతరులకు వ్యతిరే

---

* రచయిత ఈ మాటలు 1947లో చెప్పినా అవి నేటి నిత్య సత్యాలుగానే గోచరిస్తున్నాయి. అంటే యాభయ్యేళ్ళు గడచినా మన తీరు ఏ మాత్రం మారకపోగా, ఇంకా అధ్వాన్నంగానే తయారైందని రూఢమవుతోంది. రచయిత దూరదృష్టికి జోహార్లు అర్పించకుండా ఉండలేము.

కంగా విద్వేషాన్ని రెచ్చగొట్టేవాళ్ళను, ధర్మాధర్మాలతో నిమిత్తం లేనివాని ఆశయాల కోసం పోరాడటానికి సిద్ధపడేవాళ్ళను మాత్రమే ఇష్టపడుతోంది. ఈ కారణంగానే ఈ వర్గాలు తమ లోని నీచాతినీచమయిన వ్యక్తుల్ని వడపోసి ఎన్నుకున్నాయి. వారిని తమ ప్రతినిధులుగా చేసుకున్నాయి. వారు తమ పెద్దల లోని నేరస్థుల్ని వెతికి వెతికి తీశారు; వారిని తమ నాయకులుగా చేసుకున్నారు. వారి సమాజంలో అందరికంటే దిగజారినవారు, చరిత్రహీనులు, అంతరాత్మను చంపుకున్నవాళ్ళు, నీతినియమాలు లేనివాళ్ళు. తమ వర్గంవారి అభిప్రాయాలను వెల్లడించడానికి ముందుకువచ్చి పత్రికా రంగంలో అందరికి మించిన జనాదరణ పొందారు. ఇలా వీరంతా తమ తమ చెడిపోయిన వర్గాలను తీసుకుని విచ్ఛిన్నపు మార్గంపై గుడ్డిగా పరుగెత్తారు.

వీరు విభిన్న వర్గాల విరుద్ధమైన కోర్కెలను ఓ సమంజ మయిన మార్గాన వెయ్యడానికి బదులుగా వాటిని పెంచి ఘర్షణ మార్గంపై పడవేశారు. వారు ఆర్థిక, రాజకీయ లక్ష్యాల సంఘర్షణలో క్రోధం, ద్వేషం, వైషమ్యాల విషాన్ని కలిపారు, దాన్ని రోజుకు రోజు పెంచుకుంటూపోయారు వారు తమ తమ అధీనంలోని వర్గాలకు ఏండ్ల తరబడి ఉద్రేకపూరితమయిన ఉపన్యాసాలు, రచనలు నూరిపోసి రెచ్చగొట్టారు. ఫలితంగా ఆ వర్గాలు ఆవేశంతో కుక్కలు, తోడేళ్ళులా పోరాడుకోవడానికి సిద్ధమయ్యాయి. వీరు ప్రజలందరి హృదయాలను కుళ్ళిపోయిన భావాల కూపంగా, గుడ్డి విరోధంతో కణకణలాడే కుంపటిగా తయారుచేశారు.

ఇప్పుడు కళ్ళెదుట చెలరేగుతున్న తుఫాను అకస్మాత్తుగా

బయల్పడినది, తాత్కాలికమయినది, యాదృచ్ఛికమైనది కాదు. విచ్ఛిన్నానికి దారితీసే ఏ అసంఖ్యాక కారణాలయితే మనలో ఎంతో కాలంగా పనిచేస్తున్నాయో వాటి సహజమైన పరిణామమే ఇదంతా. ఈ పరిణామం ఒకే ఒకసారి బహిర్గతమయి ఆగి పొయ్యేది కాదు. మనలో ఆ కారణాలు పని చేస్తున్నంత కాలం ఇది అనుదినం చెందే వృద్ధివికాసాలతో బహిర్గతమవుతూ ఉంటుంది. ఇది అనేక సంవత్సరాలుగా నారు పోసి, నీరు పెట్టగా ఇప్పుడు పండి సిద్ధంగా ఉన్న ఓ విషపూరితమయిన పంట. మీరు, మీ రాబోయే తరాలు ఈ పంటను ఎంత కాలం వరకు కోస్తూ ఉండవలసి ఉందో!

## కిం కర్తవ్యం

మహాశయులారా! కాస్త ప్రశాంత హృదయంతో ఆలోచించండి. సర్గ్గా ప్రకృతి నియమం ప్రకారం ఈ దేశ భవితవ్యానికి సంబంధించిన కొత్త ఏర్పాట్లు జరుగబోతున్న సమయంలో భూమి యజమాని ముందు మన మన యోగ్యతార్హతలను ఎలా నిరూపించుకుంటున్నామో పరిశీలించుకోండి. ఇలాంటి సమయంలో మనం మన వైఖరి ద్వారా నిరూపించుకోవలసిందేమిటీ? ఆయన తన భూమిపై పరిపాలనా వ్యవహారాన్ని గనక మనకు అప్పగిస్తే, "మనం దాన్ని నందనవనంగా తీర్చిదిద్దుతాం; అందులో ్యాయాన్ని స్థాపిస్తాం; దాన్ని సానుభూతి, సహకారం. కారు ్యల నిలయంగా తయారుచేస్తాం; దాని వనరుల్ని మన సం ఘం కోసం, యావత్ మానవాళి సంక్షేమం కోసం వినియో ం; అందులో మంచిని పెంపొందింపజేస్తాం; చెడును

అణచివేస్తాం అని. కాని మనం ఆయన ముందు నిరూపిస్తున్న దేమిటి? మేము పరమ వినాశకారులం, కల్లోల జనకులం, దౌర్జన్యపరులం, నీవు గనక ఈ భూమిని మాకు అప్పగిస్తే మేము దాని జనవాసాలను నాశనం చేస్తాం; వాడలకు వాడల్నే ఊళ్ళకు ఊళ్ళనే తుడిచివేస్తాం; మానవ ప్రాణాన్ని, ఈగలూ దోమలకన్నా ఎక్కువగా విలువ లేకుండా చేస్తాం; స్త్రీలను అవమానపరుస్తాం; చిన్న పిల్లలను మట్టుపెడతాం! వృద్ధుల్ని, రోగుల్ని, గాయపడినవారిని కూడా కనికరించం; చివరికి ప్రార్థనాలయాలను, మత గ్రంథాలను సయితం మా హృదయ మాలిన్యంతో అపవిత్రం చేస్తాం; ఏ భూభాగంపైనైతే నీవు మానవుల్ని నివసింపజేశావో, దాని కళను మృత కళేబరాలతో, కాలిన భవనాలతో వృద్ధి చేస్తాం" ఇదేగా మన క్రియాత్మక సమాధాన మీరు అందజేసే ఈ సేవల్ని మీ ఈ గుణగణాల్ని, ఈ ఫ కార్యాల్ని చూపెట్టి దేవుని భూమిలో పరిపాలనా వ్యవహారా నిర్వహించడానికి మీరు ఎంతో యోగ్యులైన దాసులుగా అం దృష్టిలో పరిగణించబడగలరని నిజంగానే మీ అంతరాత్మ స మిస్తుందా? మీ ఈ చేష్టల్ని చూసి, "శెభాష్! నా మాజీ మాలుల సంతానమా! నా తోట కావలికి మీరే అందరిక ఎక్కువ యోగ్యులు. ఈ పీకివేత, విరిచివేత, వినాశ విచ్ఛిన్నం, మాలిన్యం, రొచ్చు, రొంపిల కోసమే కదా తోటను వేశాను. ఇక మీరు దాన్ని స్వాధీనం చేసుకుని బా నాశనం చెయ్యండి" అని దేవుడు అప్పగిస్తాడని భావిస్తున్నార

మీరు మీ విషయంలోనూ, దేశ భవిష్యత్తు విషం లోనూ నిరాశా నిస్పృహలకు గురి కావాలని నేనీ మాటలు మి

చెప్పడం లేదు. నేను స్వయంగానూ నిరాశ చెందడం లేదు—ఇతరుల్ని నిరాశపర్చాలని కోరుకోవడమూ లేదు. శతాబ్దాల తరువాత ఒక దేశం భవితవ్యాన్ని మార్చుతున్నప్పుడు విశ్వ ప్రభువు ఆ దేశవాసులకు ఓ మంచి అవకాశాన్ని ఇస్తాడు. అలాంటి స్వర్ణావకాశాన్నే నేడు భారత దేశీయులు తమ అజ్ఞానం, మూర్ఖత్వాల కారణంగా జారవిడుచుకోటానికి ఒడిగట్టారు. ఈ విషయాన్ని తెలియజేయాలన్నదే నా అసలు ఉద్దేశ్యం. మీలో ప్రతి ఒక్కరు పోటీపడి తమ ఉన్నత గుణగణాల్ని, ఉత్తమ శక్తిసామర్థ్యాలని నిరూపించుకొని, దేవుని దృష్టిలో దేశ పాలనాధికారానికి అర్హులుగా పరిగణించబడవలసిన సమయమిది. కానీ మీ మధ్య పోటీ జరిగేది ఏ విషయంలోనంటే, మీలో అధికంగా వినాశకరుడు, కఠినాత్ముడు, దౌర్జన్యపరుడు ఎవరు? వాటి కారణంగా దేవుని శాపానికి అత్యధికంగా అర్హుడు కాగల వాడు ఎవరు? అన్న విషయంలో. ఇది స్వాతంత్ర్యం, ప్రగతి, ఔన్నత్యాలు సాధించే లక్షణాలు కావు. వీటివల్ల తిరిగి మరో సుదీర్ఘ కాలం వరకు బానిసత్వం, అవమానాలు మన విధిలో వ్రాయబడతాయనే ప్రమాదముంది. అందువల్ల విజ్ఞతా వివేచనున్నవారు ఈ పరిస్థితుల సంస్కరణ గురించి ఆలోచించాలి.

ఈ సందర్భంలో పరిస్థితుల్ని సంస్కరించే పద్ధతి ఏమిటనే ప్రశ్న మీ హృదయంలో దానంతటదే జనిస్తుంది. దీనికి సమాధానం ఇవ్వడానికి నేను సిద్ధంగా ఉన్నాను.

ఈ అంధకారంలో మనకు ఒకే ఒక ఆశాకిరణం కనిపిస్తోంది. అదేమిటంటే మన ప్రజలందరూ పతనమయిపోలేదు—వారిలో కనీసం నాలుగయిదు శాతం మంది ఈ సాధారణ నైతిక

పతనావస్థకు గురి కానివారు ఉన్నారు. వీరిని వినియోగించే సంస్కరణా కార్యాన్ని ప్రారంభించవచ్చు. సంస్కరణా మార్గంలో మనం తీసుకోవలసిన మొదటి చర్య ఈ సజ్జనుల్ని ఏరుకోవటం. మన దురదృష్టానికి ప్రముఖ కారణం ఏమిటంటే మనలో చెడు అయితే సంఘటితమయి నియమబద్ధంగా తన పని చేసుకుంటూ పోతోంది. కాని మంచి అనేది సంఘటితంగా లేదు. మన మధ్య సజ్జనులయితే ఉన్నారు. కాని చెల్లాచెదరై ఉన్నారు. వారి మధ్య ఎలాంటి సంబంధాలు లేవు. ఎలాంటి ఆచరణాత్మక సహాయ సహకారాలూ లేవు. వారి దగ్గర ఏ విధమైన కార్యక్రమంగాని, సమిష్టి విధానంగాని లేవు. ఈ విషయాల వల్ల వారు ఎవరిపైనా ఎలాంటి ప్రభావం వేయలేకపోయారు.

ఎప్పుడయినా ఎవరయినా ఓ దైవదాసుడు తన చుట్టూవున్న చెడుల్ని చూసి బాధగా, నిరసనగా గళమెత్తి ఆక్రోశిస్తాడు. కాని అతనికి మద్దతుగా ఎటు వైపు నుండి అయినా ఒక్క పలుకూ వినరాదు. అతను నిరాశతో కూర్చుండిపోతాడు. ఎప్పుడయినా ఎవరయినా సత్యం, న్యాయాలను బహిరంగంగా ప్రకటిస్తాడు. కాని సంఘటితమయిన చెడు బలవంతంగా అతని నోరు నొక్కి వేస్తుంది. సత్యప్రియులు మాత్రం తమ స్థానాల నుంచి కదల కుండా అతనికి వర్షాలు కురిపించి మౌనంగా ఉండిపోతారు. ఎప్పుడయినా ఎవరయినా మానవత్వం ఖూనీ అవడాన్ని చూసి సహించలేక దానిపట్ల నిరసన ప్రకటిస్తాడు. కాని, దౌర్జన్య పరులు గందరగోళం సృష్టించి అతడ్ని అణచివేస్తారు, అతనికి పట్టిన దుర్గతి చూసి అంతరాత్మ సజీవంగా ఉన్న అనేక మంది ధైర్యం వీడి కూర్చుంటారు. ఈ పరిస్థితి ఎప్పుడు అంతమవు

తుంది. మన దేశం దైవ శిక్షకు గురయి, ఆ శిక్షకు సజ్జనులు, దుర్జనులు అందరూ గురికావడం మనకు ఇష్టం లేకపోతే మనలో నైతిక జాడ్యానికి లోనుకాకుండా మిగిలి ఉన్న సజ్జనులు ఏకం కావడానికి, సంఘటితమవడానికి, మనల్ని వినాశం వైపుకు అతి వేగంగా తీసికెళ్తూ ఉధృతమవుతున్న ఈ ఉపద్రవాన్ని సామూహిక శక్తితో ఎదుర్కొనడానికి ప్రయత్నాలు ప్రారంభం కావాలి.

ప్రస్తుతం ఈ మంచి శక్తులు నిరాశ కలిగించేటంతటి అల్ప సంఖ్యలో ఉండటం పట్ల ఆందోళన చెందకండి. ఈ కొద్ది మందే సంఘటితమయి వీరి వ్యక్తిగత, సామూహిక వైఖరి స్వచ్ఛమయిన ధర్మం, న్యాయం, సత్యప్రియత్వం, చిత్తశుద్ధి, నిజాయితీల ఆధారంగా పటిష్టమయితే, దాంతోపాటు వారి వద్ద జీవిత సమస్యల అత్యుత్తమ పరిష్కారం, ప్రపంచ వ్యవహారాల్ని సవ్యమయిన పద్ధతులపై నడిపించడానికి ఓ మంచి కార్యక్రమం కూడా ఉంటే— అలాంటి సంఘటితమయిన "మంచి" ముందు సంఘటితమయిన "చెడు" తన వద్ద అత్యధిక సైనిక బలగమున్నా, దుష్ట ఆయుధాల ఎంత వాడిమి ఉన్నా పరాజయం పొంది తీరుతుందని నమ్మండి.

మానవ ప్రవృత్తి చెడును ఇష్టపడదు. దాన్ని మోసగించవచ్చు, ఇంకా చాలా వరకు దాన్ని వికృతంగా మార్చివేయనూ వచ్చు. కాని అందులో సృష్టికర్త ఉంచిన "మంచి" అనేదాని విలువను పూర్తిగా నిర్మూలించడం ఎన్నటికీ సాధ్యపడదు. చెడు పట్ల మాత్రమే ఆసక్తి కలవారు దానికే ధ్వజవాహకులై నిలబడే వారు మానవుల్లో బహు స్వల్పంగా నే ఉంటారు. అలాగే మంచిని

ప్రేమించేవారు, దాని స్థాపనకై కృషిచేసేవారు కూడా స్వల్పంగానే ఉంటారు. ఈ రెండు వర్గాల మధ్య ఉండే సామాన్య ప్రజలు మంచి, చెడుల మిశ్రమ వైఖరిని కలిగి ఉంటారు. వారు చెడును ఆరాధించేవారూ కారు. మంచి పట్ల కూడా వారికి అసాధారణ ఆసక్తి ఉండదు. వారు ఏదో ఒక వైపుకు మొగ్గడమన్నది మంచి చెడుల ధ్వజవాహకుల్లో ఎవరు ముందుకు వస్తారు, ఎవరు వారిని తమ దారి వైపుకు ఆకర్షిస్తారు అన్న విషయంపై పూర్తిగా ఆధారపడి ఉంటుంది. ఒకవేళ సత్యప్రియులు మైదానంలోనే దిగకపోతే, ప్రజల్ని మంచి మార్గంపై నడిపించే ప్రయత్నమే చెయ్యకపోతే, మైదానం తప్పనిసరిగా "చెడు"కు ధ్వజవాహకులయినవారి అధీనంలోనే ఉంటుంది. వారు సామాన్య ప్రజానీకాన్ని తమ మార్గం వైపుకు లాక్కెళ్ళ్తారు. కాని సత్య ధ్వజవాహకులు కూడా మైదానంలోనే ఉంటే, వారు సంస్కరణా బాధ్యతను సరిగ్గా నిర్వర్తిస్తే సామాన్య ప్రజలపై "చెడు" వైపుకు పిలిచేవారి ప్రభావం ఎక్కువ కాలం ఉండదు. ఎందువల్లనంటే ఈ రెండు వర్గాల మధ్య పోటీ చివరికి నైతికతా రంగంలోనే తేలుతుంది. ఈ మైదానంలో దుర్జనులు సజ్జనుల్ని ఎన్నటికీ ఓడించలేరు. సత్యానికి ఎదురుగా అసత్యం, నిజాయితీకి ఎదురుగా మోసం, సద్వర్తనకు ఎదురుగా దుర్వర్తన ఎంత బలాన్ని ఉపయోగించినా చివరికి విజయం— సత్యం, నిజాయితి, సద్వర్తనలనే వరిస్తుంది. సద్గుణాల తీపిని, దుర్గుణాల చేదుని రుచి చూసిన తరువాత, తీపి కంటే చేదే మంచిదని నిర్ణయానికి వచ్చే అంత జ్ఞానరహితం కాదీ ప్రపంచం.

## స్పష్టమయిన భావనలు

సంస్కరణకై నడుం కట్టినప్పుడు సజ్జనులకు ఒక సంస్థతో పాటు కావలసిన మరో రెండో ముఖ్యాంశం ఏమిటంటే, 'నిర్మాణం–విచ్ఛిన్నా'లకు సంబంధించిన విస్పష్టమయిన భావన. "విచ్ఛిన్నాన్ని" నిర్మూలించే కృషి చెయ్యడానికి "విచ్ఛిన్నం" అంటే ఏమిటో మనం సరిగా అర్థం చేసుకోవాలి. అలాగే "నిర్మాణం"ను అమలుపరిచేందుకు యావత్ శక్తిని వినియోగించడానికి వీలుగా "నిర్మాణం" అంటే ఏమిటో కూడా మనం క్షుణ్ణంగా తెలుసుకోవాలి. వివరాల్లోకి పోవడానికిది సందర్భం కాదు. నిర్మాణం, విచ్ఛిన్నాల ఓ స్వరూపాన్ని నేను క్లుప్తంగా మీ ముందుంచుతున్నాను.

మానవుని జీవితంలో ఏ విషయాల మూలంగా విచ్ఛిన్నం జనిస్తుందో వాటిని మనం నాలుగు పెద్ద శీర్షికల కింద చేర్చవచ్చు. అవి :

### 1. దైవభీతి లేకపోవడం :

ప్రపంచంలో అన్యాయం, దయారాహిత్యం, మోసం, తదితర నైతిక రుగ్మతలన్నిటికీ దైవభీతి లేకపోవడమే కారణం.

### 2. దైవ మార్గదర్శకత్వం పట్ల ఉపేక్ష :

దీని కారణంగా ఏ విషయంలో మనిషి పాటించవలసిన శాశ్వత నైతిక సూత్రాలు మిగులలేకపోయాయి. ఈ కారణంగానే వ్యక్తులు, వర్గాలు, జాతుల వైఖరి అంతా స్వార్థప్రియత్వం, విషయలోలత్వం, మనోవాంఛల దాస్యంపై స్థిరపడింది. తత్ఫలి

తంగానే వారు తమ ఆశయాల్లో ధర్మాధర్మాల విచక్షణను పాటించరు ; ఆ ఆశయాల సాధనకై ఎలాంటి చెడు మార్గాన్ని అవలంబించడానికయినా ఏ మాత్రం వెనుకాడరు.

## 3. స్వార్థం :

ఇది వ్యక్తుల్ని ఒకరి హక్కుల్ని మరొకరు కాజెయ్యడానికి పురికొలుపుతుంది, అంతేకాదు, భారీ ఎత్తున కులతత్వం, జాతీయ తత్వం, వర్గవిచక్షణల రూపాన్ని కూడా ధరిస్తుంది. దానివల్ల కల్లోలజనక మార్గాలు అనేకం జనిస్తాయి.

## 4. స్తబ్దత లేక మార్గవిహీనత :

దీని మూలంగా మనిషి దైవం ప్రసాదించిన శక్తిసామర్థ్యాలను వినియోగించకపోవడమయినా లేక దుర్వినియోగపరచడమయినా జరుగుతుంది. దైవం ప్రసాదించిన వనరుల్ని వాడుకోకపోవడమయినా జరుగుతుంది. లేదా తప్పుగా వాడుకోవడమయినా జరుగుతుంది. స్తబ్దత ఉన్న పక్షంలో దేవుని నియమావళి ఏమిటంటే ఆయన సోమరులు, చవటలను అట్టే కాలం తన భూమిపై అధికారంలో ఉంచడు. వారి స్థానంలో ఎంతో కొంత "నిర్మాణం" చేసేవాళ్ళను ఆయన నియమిస్తాడు. మార్గ భ్రష్టత ఉన్న పక్షంలో, చెడు జాతులు చేసే "విచ్ఛిన్నం" అవి చేసే నిర్మాణం కంటే అధికమయినప్పుడు వాటిని దేవుడు తొలగిస్తాడు తరచూ అవి సృష్టించే "విచ్ఛిన్నా"నికే వాటిని ఆహుతి చేస్తాడు.

ఏ విషయాల మూలంగానయితే మానవుని జీవితంలో నిర్మాణం జరుగుతుందో వాటిని కూడా నాలుగు శీర్షికల క్రింద విభజించవచ్చు :

## 1. దైవభీతి :

ఇది ఒక్కటే మనిషిని చెడుకు దూరంగా ఉంచి, రుజు మార్గంపై నడిపించగలదన్న నమ్మకమయిన హామి. శాంతియుతమయిన, వర్ధమాన నాగరికతా సంస్కృతులు ఉనికిలోకి రావడానికి మూలాధారాలైన రుజువర్తనం, న్యాయం, నిజాయితి, సత్యపరాయణత, ఆత్మనిగ్రహం ఇంకా ఇలాంటి అనేక సుగుణాలు దీన్నుండే ఆవిర్భవిస్తాయి. పాశ్చాత్యుల్లో కొద్దో గొప్పో జనించినట్లు కొన్ని ఇతర విశ్వాసాల ద్వారా కూడా కొంతమేరకు వీటిని జనింపజేయవచ్చు. కాని ఈ సాధనాలతో సంపాదించిన సద్గుణాలు వృద్ధిచెంది ఒక దశలో ఆగిపోతాయి. ఆ దశలోనూ వాటి పునాదులు బలహీనంగా ఉంటాయి. దైవభీతి మాత్రమే దృఢమయిన పునాది. చెడుకు దూరంగా ఉండే, మంచిని అనుసరించే గుణం ఈ పునాదిపైనే మనిషిలో పటిష్టంగా నెలకొంటుంది. ఇంకా, అది పరిమిత స్థాయిలోకాక ఎంతో భారీ ఎత్తున మానవ వ్యవహారాలన్నింటిపై తన ప్రభావం చూపుతుంది.

## 2. దైవ మార్గదర్శకత్వాన్ని అనుసరించడం :

ఇదొక్కటి మాత్రమే మానవుని వ్యక్తిగత, సామూహిక, జాతీయ, అంతర్జాతీయ వైఖరులు శాశ్వత నైతిక నియమావళికి కట్టుబడి ఉండేలా చెయ్యగల మార్గం. మానవుడు తన నైతిక సూత్రాలకు తానే కర్తగా రచయితగా ఉన్నంత వరకు అతని వద్ద మాటలు చెయ్యడానికి కొన్ని సూత్రాలయితే ఆచరణలో పెట్టడానికి వేరే కొన్ని సూత్రాలుంటాయి. పుస్తకాల్లో మటుకు స్వర్ణాక్షరాలలో అతను ఒక విధమయిన నియమాలు వల్లిస్తాడు.

కాని వ్యవహారాల్లోకి వచ్చేటప్పటికి తన ప్రయోజనాల కనుగుణంగా వేరే విధమయిన నియమాలను ఆచరిస్తాడు. ఇతరుల నుండి అతను కోరే నియమాలు ఒక రకంగా ఉంటాయి. వ్యవహారం స్వయంగా తన దగ్గరికొచ్చినప్పుడు మరో రకంగా ఉంటాయి. సందర్భం, ప్రయోజనం, వాంఛలు, అవసరాల వత్తిడికి అతని సూత్రాలు అనుక్షణమూ మారుతుంటాయి. అతని వద్ద నైతికతకు మూల కేంద్రం 'సత్యం' కాదు, "స్వప్రయోజనం" అయి ఉంటుంది. తన ఆచరణను సత్యానికి అనుగుణంగా మలచాలన్న విషయాన్ని అసలు అంగీకరించడు. దానికి బదులుగా అతను, సత్యం తన ప్రయోజనానికి అనుగుణంగా మారాలని కోరుతాడు. దీని మూలంగానే వ్యక్తులు మొదలుకుని జాతుల వరకు అందరి వైఖరీ అపమార్గం పడుతుంది. దీనివల్లనే ప్రపంచంలో ఉపద్రవం చెలరేగుతుంది. దీనికి భిన్నంగా మనిషికి శాంతి, సౌఖ్యం, సాఫల్యం. సౌభాగ్యాలు ప్రసాదించేందుకు నైతికతకు సంబంధించిన కొన్ని సూత్రాలు కావాలి. అవి ఏవయినా ప్రయోజనాల దృష్ట్యా కాకుండా కేవలం "సత్యం" దృష్ట్యా రూపొందించబడినవై ఉండాలి. వాటి శాశ్వత సత్తాను అంగీకరించి అన్ని వ్యవహారాల్లోనూ పాటించాలి. ఆ వ్యవహారాలు వ్యక్తిగతమయినవయినా, జాతీయమయినవయినా అవి వాణిజ్యానికి సంబంధించినవైనా, రాజకీయాలకు, సంధి, యుద్ధ వ్యవహారాలకు సంబంధించినవయినా సరే. అయితే ఇలాంటి సూత్రాలు మనకు దైవ మార్గదర్శకత్వంలోనే ప్రాప్తం కాగలవన్నది సుస్పష్టం. ఈ సూత్రాలను అమలుజరపడానికి సాధ్యమయిన మార్గం ఒక్కటే. మనిషి వాటిలో మార్పులు చేర్పులు చేసే అధికారాల్ని వదలుకొని వాటిని ఎట్టి పరిస్థితిలోనూ అనివార్యంగా అనుసరణీయమయినవిగా స్వీకరించాలి.

## 3. మానవతా వ్యవస్థ :

అది వ్యక్తిగత, జాతీయ, వంశ, వర్గ స్వప్రయోజనాలకు బదులుగా సకల మానవుల సమాన స్థాయి, సమాన హక్కుల ఆధారంగా ఏర్పడాలి. అందులో అసంబద్ధపు విచక్షణలు, నిమ్నోన్నతా భేదభావాలు, అంటరానితనం, కృత్రిమ దురభిమానాలు ఉండకూడదు ; అందులో కొందరికి ప్రత్యేక హక్కులు, కొందరిపై కృత్రిమ ఆంక్షలు, అడ్డంకులు ఉండకూడదు. అందులో అందరికీ వృద్ధివికాసాలు పొందే సమానావకాశాలు లభించాలి. మనిషికి ఆపాదితమయ్యే నీచ స్థాయికయినా, ఉచ్ఛ స్థాయికైనా అతని గుణగణాలే ప్రాతిపదికలు కాగలగాలి. ప్రపంచంలోని మానవులంతా ఆ వ్యవస్థలో సమంగా భాగం పంచుకునేలా అది విశాలత్వం కలిగి ఉండాలి.

## 4. సదాచరణ :

అంటే దైవం ప్రసాదించిన శక్తిసామర్థ్యాలను, వనరుల్ని పూర్తిగా వినియోగించాలి. సరయిన రీతిలో వినియోగించాలి.

మహాశయులారా ! ఈ నాలుగు విషయాల సంచయనానికే "నిర్మాణం, సంస్కరణ" అనంటారు. "విచ్ఛిన్నం" తెచ్చే కారణాలను అరికట్టడానికి, "నిర్మాణం" చేసే పద్ధతుల్ని అమలు పరచడానికి అవిశ్రాంతంగా కృషి చెయ్యగలందులకు సదాచార సంపన్నులయిన వ్యక్తుల సంస్థ ఒకటి మనలో ఉండాలి. ఇందులోనే మన శ్రేయం ఇమిడి ఉంది. ఈ కృషి ఈ దేశ ప్రజల్ని సన్మార్గంపై తీసుకురావడంలో విజయవంతం కాగలగాలి. అలాంటప్పుడు కూడా దేవుడు తన భూమి పరిపాలనా వ్యవహారాన్ని దాని అసలు పౌరుల నుండి అనవసరంగా లాక్కొని మరెవరికైనా ఇచ్చేంత అన్యాయం చేసేవాడు కాదు. కాని ఒకవేళ ఈ కృషి విధివశాత్తు విఫలమయితే నా గతి, మీ గతి, ఈ దేశంలో నివసించేవారి గతి ఏమవుతుందో చెప్పడం కష్టం.

